EG.No.M.2185 REG.No.N4.

The First Telugu Bi-weekly in Andhra Desa, The only Telugu News Paper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

హైదరాబాదు—దక్కను

10314 7

GOLAKONDA PATRIKA. HYDERABAD Dn

సంపుటము ౫ } ప్రమోదూతనామ సంవత్సర కార్తీక శు॥ ౯ బుధవారము 29—10—30 { సంచిక ౪౬

## ఏజెంట్లు కావలయును

మా పత్రికకు చందాదారులను కూర్చుటకు దిగువ స్థలములలో ఏజెంట్లు కావలయును:—

ఊ: ౧. సికిందరాబాదు, ౨. జనగామ, ౩. వరంగల్లు, ౪. మహబూబాబాదు ౫. ఖమ్మం, ౬. వికారాబాదు, ౭ మహబూబునగరు ౮. నిజామాబాదు ౯. బెజవాడ. ౧౦ కరీంనగరము, ౧౧ నాందేడు, ౧౨. గుల్బర్గా, ౧౩. సూర్యాపేట, ౧౪. మిర్యాలగూడెము, ౧౫. దేవరకొండ, ౧౬. ఆసిఫాబాదు

వివరములకై దిగువవారికి వ్రాయుడు.

మేనేజరు
గోలకొండ పత్రిక
త్రూపుబజారు హైదరాబాద్ దక్కను.

# గోలకొండ ముద్రాక్షరశాల

పలురకముల అచ్చుపనులు ప్రాకు ప్రింటింగు

రూలింగ బైండింగు

గ్రంథములు
రసీదుబుక్కులు
మోటారు టిక్కెట్లు
సినిమా టికెట్లు
నమూనా ఫారములు

ఫారములు
నోటీసులు శుభపత్రికలు
లెటరు హెడ్సు
విజిటింగ్ కార్డులు
ప్రామిసరీనోట్లు

తెనుగు ఇంగ్లీషు

అందమగు క్రొత్తటైపుతో సిద్ధము చేయబడును. అచ్చుతప్పులు లేకుండా సరిచూచి నియమిత కాలమునకు తయారుచేసి యివ్వబడును. ముఖ్యముగా జిల్లాల ఆర్డరులు శ్రద్ధతో చేయబడును. సరసమైనధరలు.

మేనేజరు
గోలకొండ పవర్ ప్రెస్
త్రూపుబజారు హైదరాబాదు

కలరా కలరా

నలువైపుల కలరా వ్యాపించినది, కాని పరమేశ్వరుని కృపవలన

# జిందాతిలస్మాత్

దానితో నెట్లు పోటీ చేయుచున్నదో చూడుడు

పద్మశీ పిస్తంజీ షావుకారులగు రహీంఖాన్ సా॥ మాకిట్లు వ్రాయుచున్నారు:—

అబ్దుల్ కరీం సా॥ వర్తకులకును. ఛూసాన్ కంపెని క్లర్కులగు సోమాను గారికిని అత్యంత హాకరమగు కలరా సోకెను వీరుతమ ప్రాణములపై ఆశవదలుకొనిరి కాని కరామతుల్లా హుసేన్ సా॥ వర్తకులు మున్నగువారు ఔషధమును క్రమముగ నుపయోగించిరి అందుచే వారు ఆరోగ్యమును పొందిరి

దీనినిబట్టి మేము విన్నవించునదేమన అంటువ్యాధులగు కలరా ప్లేగు సంభవించినపుడు జిందాతిలస్మాత్ యొక్క ఒక చుక్క మొదలుకొని అయిదుచుక్కలవరకు వారివారి వయస్సునుబట్టి త్రాగినను ఇచ్చినను ఈ వ్యాధి అంటదని తెలుపుచున్నాము

టెలిఫోన్ ౭౦౨

కార్ఖాన జిందా తిలస్మాత్

Zinda Tilasmath

కాచీగూడ, హైదరాబాదు (దక్కన్)

---

స్థాపితము 1923

# ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

హెడ్ ఆఫీసు మచిలీపట్టణము శాఖలు కాకినాడ హైదరాబాదు దక్కన్

కరెంటు ఎక్కౌంట్లు: రూ. 100. అంతకుపై మొత్తములతోను తెరువ వచ్చును. జనవరినుండి జూన్ వరకు సం॥ నకు రూ. 21/2%, జూలై నుండి డిసెంబరు వరకు సం॥ నకు 2/చొప్పునను, నెలసరికనీసపు నిలువ మొత్తములపై వడ్డీయివ్వబడును. హాలీ ఎకౌంట్లమీద జూలై నుండి డిసెంబరుతో అంత్యమగు ఆరునెలలకు వడ్డీఇవ్వబడదు. ఒక్కొక్కరికేక ఒక హాలీ ఒకకల్దారు ఖాతా తెరువ వచ్చును.

సేవింగ్సు బ్యాంకు ఎకౌంట్లు: రూ. ౕతో తెరువవచ్చును. కల్దారు ఎకౌంట్లపై నూటికి సం॥ నకు 4½, హాలీ ఎకౌంట్లుపై నూటికి సం॥ నకు రూ. 4చొప్పునను, ప్రతినెల 6వ తేదీ మొదలు మాసాంతములోగా, రూ. 3000 లకు మించక నిలువయుండు కనీసపు మొత్తములపై వడ్డీఇవ్వబడును. ఒక్కొక్కరికేర ఒకహాలీ ఒకకల్దార్ ఖాతా తెరవవచ్చును.

ఫిక్సెడ్ డిపాజిట్లు రూ 5000 వరకూ ౧ సంవత్సరమునకు 4½% ఇవ్వబడును. ఇంతకు మించిన మొత్తములకు గాని సంవత్సరముకన్న ఎక్కువ కాలము నిలువ యుంచబడు మొత్తములకు గాని ఇవ్వబడు రేట్లువివరము, బ్యాంకునందు తెలిసికొనవచ్చును.

బ్యాంకు ఆదివారము తప్ప ప్రతిదినము 9 గంటలు మొదలు 3 గంటలు } వరకు తెరచి
శనివారము 9 గంటలు మొదలు 1 గంట } యుండును.

డి. యస్. శాస్త్రి ఎం. ఏ. ఎల్. టి. ఎ. ఐ. బి. } సెక్రెటరీ

ఎస్. ఎమ్. ఎస్. విజయ. ఏజంటు

---

కేసరిరత్న త్రయము.

# లోధ్ర

గర్భాశయ రోగనివారిణి.

స్త్రీలకు గలుగు ముట్టునొప్పి, బహిష్టి కాకుండుట, అకాలబహిష్టి, తెల్ల బట్టలు, కడుపు వరాకుపోవుట, కుసుమరోగము, సంతానహీనత రక్తహీనత, మలబద్ధకము, నూతికావాతము, కీళ్లనొప్పులు అజీర్ణము, అరచేతులు మంట మొదలగు స్త్రీ సర్వవ్యాధులను కుదుర్చును.

పెద్దబుడ్డి రు ౩-౦-౦. చిన్నది రు 1-10-0.

# అమృత

రక్తశుద్ధి ద్రావకము.

ఇదిరక్తహీనత మలబద్ధకము, అజీర్ణము, కీళ్లనొప్పులు, నోమరితనము, దేహవ్రణములు, మూత్రసంకటములు, ... కడుపులో మంట మొదలగువ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సును యిచ్చును.

పెద్దబుడ్డి రు ౩-౦-౦. చిన్నది రు 1-10-0.

# అర్క

జ్వర నివారిణి. బుడ్డి 1-౫ రూ. 1-8-0

కేసరికుటీరం, ఆయుర్వేద ఔషధశాల,

Kesari kuteerum Egmore, Madras.

---

రాత్రింబగలు మోటారు టాక్సీలు లభించును

కరీం మోటారు ట్యాక్సీ

కొ. వ. గనిరెడ్డిపల్లి హైదరాబాదు స్టేషన్ రోడు

గనుపరచినను ఇటులచేయుట మంచిదికాదనియు ఏదో ౨ గంటలు కూర్చుండినచో వ్రిజాసామా, వ్యయమునకు లాభము గలుగజాలదనియు నుడివిరి.

అధ్యక్షులు:— దీనివిషయమున యిదివరకే వాదోపవాదములు జరిగినవి.

కొత్వాలుగారు; వాదనలు జరిగినపిమ్మట తీర్మానముగూడ నైనది. సాయంత్రము సభ జరిగినచో అధికారులు కార్యాలయములలో పనిచేసి అలసివచ్చుటచే పనిజరుగజాలదు.

రామచంద్రనాయకుగారు:— అక్కరైనచో అధికారులు రాజీనామా ఇవ్వవచ్చును.

కొత్వాలుగారు:—రాజీనామాయిచ్చినచో అంగీకరించువారు లేరుగదా!

అధ్యక్షులు; ఈ విషయమై తదుపరిచర్చజరుగును తదుపరి రెండువిషయములు సెలవుతీసికట్టినవానినిగురించి నోటీసులు యివ్వబడునటుల తీర్మానింపబడెను.

పిమ్మట ౯,౩౦ గంటలకు సభ సమాప్తమయ్యెను.

---

## జవాహరిలాలుగారి విచారణ

పండిత జవాహరిలాలుగారి కేసువిచారణనైని జైలులో జరిగెను. వీరు విచారణలో పాల్గొనలేదు వీరు విడుదలచేయ బడిన తెల్లవారి యొసగిన ఉపన్యాసముపై నేరము మోపబడినది.

పండిత జవాహరి లాలుగారు విచారణానంతరము కోర్టులో యీ క్రింది స్టేటుమెంటు నొసగిరి:—

"ఇప్పటికి అయిదవసారి నేను అరెస్టు జేయబడితిని. బ్రిటిషు అధికార్లు అనేక నేరములు నామీద మోపిరి. ఈ అయిదవసారి గూడ నాకు శిక్షవిధింప బడునని నాకు నమ్మకము గలదు. ఇంతవరకును యీ విచారణయందు నేను పాల్గొనలేదు: పాల్గొనను, అయినను నన్ను విచారణచేయు అధికారులకును, నన్ను గౌరవము జేసిన ప్రజలకును, నాహృదయ మందుగల విషయమునొక్క దానిని చెప్ప దలచితిని.

"నేను రాజద్రోహ నేరము జేసితిననియు, బ్రిటిషుగవర్నమెంటు యెడల అవిశ్వాసము చేయుచున్నాననియు, నామీద నేరములు మోపబడెను. ఎనిమిదిన్నర సంవత్సరములకుపూర్వము యిట్టి నేరము నామీద మోపబడినప్పుడు, బ్రిటిషు ప్రభుత్వము యెడల అవిశ్వాసము ప్రబలజేయుట హైందవుల కొకమతమైనదని జెప్పియుంటిని. ఎందుచేత ననగా హైందవులు స్వాతంత్ర్యమును యీ పరిస్థితులలో సంపాదింపలేరు. ఇది నాకు తెలిసినప్పటినుండియు, బ్రిటిషుసామ్రాజ్యాధికారముతో పోరాడుటే నా జీవనధర్మముగా పరిగణించితిని. ఇంగ్లాండుతో, మాకెట్టి విరోధములేదు. ఇక భారతీయులు నాయెడ జూపిన ప్రేమ విశ్వాసములకు నేను కృతజ్ఞుడను. ఈ మహాయుద్ధములో పోరాడి నాకు తోచినది చేయుట నాకానంద దాయకము. నా దేశీయులు, స్వాతంత్ర్యము వచ్చువరకు పోరాడుదురుగాక యని నేను ప్రార్థించుచున్నాను."

---

### సి. రాజగోపాలాచారిగారు.

తమిళనాడు కాంగ్రెసు సంఘాధ్యక్షులగు సి. రాజగోపాలాచారిగారికి 1 సంవత్సరము విడి జైలుశిక్షవిధింపబడెను. వీరిస్థానమున ఎస్. సత్యమూర్తిగారిని వీరు అధ్యక్షునిగా నియమించిరి.

# వివిధవార్తలు

### కాంగ్రెసుకమిటి కార్యదర్శి

మహాదేవ దేశాయిగారు అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహకసభకు పండిత గోవింద మాలవ్యగారి స్థానే కార్యదర్శిగా నియమింపబడిరి.

### కాంగ్రెసుకు యిల్లుఅద్దెకిచ్చుట నేరమా?

అక్టోబరు ౨౫౨ తేదిన అహమదాబాదునందు గుజరాతు రాష్ట్రీయ కాంగ్రెసు కార్యాలయము తెరువబడెను. జాతీయపతాకము యెగురవేయబడెను ఇంతలో కలెక్టరు ... కాంగ్రెసుకు ఇల్లు అద్దెకిచ్చినవారిని ప్రశ్నించెను దానిపై యజమాని తాను ... పోలీసువారు కార్యాలయము సోదాచేసి బల్లలు, పతాక ... పుస్తకములను స్వాధీనపరచుకొని యింటియజమానిని అరెస్టుచేసిరి

### సేన్‌గుప్తాగారు

జె. ఎం. సేన్‌గుప్తగారు అమృతసరులో అరెస్టు చేయబడి ఢిల్లీకి గొనిరాబడిరి ఇచట వీరి విచారణజరుగును

### అవంతికాబాయి గోఖలేగారి అరెస్టు

బొంబాయి యుద్ధసంఘనియంతలగుశ్రీమతి అవంతికాబాయి గోఖలేగారు అక్టోబరు ౨౫౨ తేదిన అరెస్టుచేయబడిరి మెజిస్ట్రేటు ఈ నెలశిక్షయు రు ౫౦౦ జుర్మానాయు విధించెను జుర్మానాచెల్లించనిచో ఇంకను మూడునెలల శిక్ష అనుభవించవలయును,

శ్రీయుత వీరేంద్రనాథ్ చటోపాధ్యాయగారిని నియంతగా యేర్పరచిరి,

### వర్షపాతము

చెన్నరాష్ట్రములో వర్షపాతము ... అయినందున నష్టము కలిగినది రెడ్‌హిల్సు (మద్రాసు) సమీపమున ఒక యువకుడు అక్టోబరు ౨౫ తేదిన ... పడుటచే మరణించెను. మూర్తి (మద్రాసు)లో ఒక కుటుంబము ... చే మరణించెను ... ప్రవాహముచే ... మయ్యెను, ట్రెషరుమాస్టరు కొట్టుకొనిపోవుటచే మరణించెను.

### మైమర్ సింగు శిక్షలు

విచారణయందున్న ౫౩ గురు ఖైదీలకు మైమర్‌సింగు ... జైలునిబంధనలకు వ్యతిరేకముగా నడచిరని శిక్షవిధింపబడెను.

### మద్రాసు నూతన మంత్రివర్గము

ఈసారి జస్టిసుపార్టీవారు పరిపాలనమునకు వచ్చిరి. డి. బి. మునిస్వామి నాయుడుగారు ప్రధానమంత్రులు. వీరి యాజమాన్యమున స్థానికపరిపాలనశాఖ, ఆరోగ్యశాఖ ఇతరశాఖలుండును. పి. టి. రాజన్‌గారికి అభివృద్ధి రిజిస్ట్రేషన్‌శాఖలును బి. బి. కుమారస్వామి రెడ్డియారుగారికి విద్య, ఆబ్కారీ శాఖలును ఒప్పగించబడినవి.

---

## ప్రకటన

సర్వజనులకును, మౌజే దివిటిపల్లి ఉరుఫ్ నారాయణపురం అగ్రహార్ తాలూకే జడ్చర్ల గావ్ యొక్క రియాయితిలకున్న ఇందువల్ల ప్రకటించునది ఏమనిన గ్రామముయొక్క అస్సల్ ఖాబిజు మరింగంటి అప్పలాచారి వల్లు రామానుజాచారి యుండిరి. వీరి జమానాలోనె గ్రామంయొక్క పయిమాయిషు బందోబస్తుఅయ్యి అందులోని కొల్దారులు వ ఖాబిజుదారులు తిస్తురకాలు అప్పలాచార్యులకె ఇస్తువచ్చిరి. ఇప్పుడు వారి మరణానంతరమున వారి కొమారులగు వెంకటరామానుజాచారి వ రంగాచారి వ రామాచారి వారి ముఖ్యవారసులని నిర్ణయింపబడి మాజె మజ్కూరొయొక్క ఖాబిజులై యుండుటవల్ల వీరికే సదరు మౌజాయొక్క అధికారము దొరకుచున్నది. ఇట్టి కాబిజుల మినహా మరివకరికి ఎవరయిన మౌజా మజ్కూరొయొక్క రఖాలు లేక పన్నులు దీనికి విరుద్ధముగా ఇచ్చి ఖిలాఫ్ నడచినతీరుకు అట్టి ఖిలాఫ్ నడిచేవారు స్వంత జిమ్మెదారినుండి ఖాబిజుల ముఖాబిలాలో విడుదల గానేరరు గనుక ఈ ప్రకటన ప్రతివారికి తెలియుటకై ఇవ్వనైనది.

మిర్జాసబ్ అగ్రహారీకు

మార్ఫ్ జహాంగీర్ హుసేన్ వకీల్ హైకోర్టు

చామహిల్లా హైద్రాబాద్.

గోలకొండపత్రిక
ప్రమోదూతనామ సం॥ కార్తీక శు॥ ౫
బుధవారము

# వాఖ్రైబిల్లు

పండిత కేశవరావుగారు బాల్యవివాహ నిషేధమునకై "వాఖ్రైబిల్లు" ను మన శాసనసభలో ప్రవేశపెట్టుటకనుమతి కోరియుండిరి. ప్రభుత్వ సభవారు దానిని దీర్ఘముగ నాలోచించి బ్రిటిషు ఇండియాలో శారదాబిల్లువలన విఫలితములు కనుగొని అట్టి శాసనమిచట ప్రవేశపెట్టుట మంచి సూచించుచు వాఖ్రైబిల్లును శాసనసభలో ప్రవేశపెట్టుటకంగీకారమొసగలేదు.

భారతదేశములోని స్వదేశ సంస్థానములలో నాయకమణియనదగిన నిజాంరాష్ట్రము విద్యయందేమి, సంఘసంస్కరణమునందేమి, రాజకీయ విషయములందేమి, ఇతర సంస్థానములకన్న చాల వెనుకబడియున్నది. ప్రజలు చదువుకున్నవారు కాకుండుటచేతనే ఇతరవిషయములలోకూడ చాల వెనుకబడియున్నారు. తమహక్కులకొర్కై పోరాడుటకును, తమ అభివృద్ధికై పాటుపడుటకును, శక్తిలేదు. బరోడా మున్నగు సంస్థానములలో కొన్ని సంవత్సరములకు పూర్వమే బాల్యవివాహములు నిషేధింపబడినవి. కొన్ని సంస్థానములు వివాహముల గూర్చియేగాక ఇతరసాంఘిక విషయములలో బ్రిటిషు ఇండియాకన్న చాల ముందు పోయినవి. ఆ సంస్థానములు బ్రిటిషు ఇండియాలో యేదైన చట్టము ప్రవేశపెట్టబడిన పిమ్మట దాని ఫలితమునకై వేచియుండలేదు. వారు బ్రిటిషు ఇండియాకన్న ముందే ప్రవేశపెట్టిరి. అయినను మన ప్రభుత్వమువారు బ్రిటిషుఇండియా ఫలితమునకై వేచియుండుటేలనో మాకు తెలియకున్నది.

ఈ బిల్లుకు హిందూముసల్మానులలో పూర్వాచార పరాయణులు వ్యతిరేకముగ నున్నారనుట నిజమే. ముసల్మానులలో ప్రస్తుతము బాలికలకు ౧౪ సంవత్సరములు దాటిన పిమ్మటనే వివాహము చేయుచున్నారు. కాని హిందువులలో అటుల కాదు. హిందువులు ముక్కుపచ్చలారని పిల్లలకే తాళికట్టుచున్నారు. ౧౦ లేక ౧౧ సంవత్సరముల బాలికలు సంసార భారము వహించవలసి వచ్చుచున్నది. కనుకనే ఇట్టి బిల్లు తేబడినది.

కొందరు వివాహములు యుక్తవయస్సువచ్చిన పిమ్మట చేయుటకై ప్రజలలో ప్రచారముచేయవలయుననియు ఇట్టివిషయమున శాసనముండకూడదనియు చెప్పుదురు. కాని ఇట్టి ఆచారములు ప్రచారముకన్న శాసనమువలననే సులభముగ నిర్మూలింపవచ్చును. తుర్కీ దేశమును మనము చూచుచుండగనే, సంస్కరణముంగూర్చి మనము ఆలోచించుచుండగనే, విద్యావిషయమునందేమి సాంఘిక విషయమునందేమి, ఎట్లభివృద్ధి చెందినది! అచట ప్రభుత్వమీ విషయములందు జోక్యము కలిగించుకొనుటచేతనే ఈ అభివృద్ధి కలిగెను. కాని ప్రజల వలన నైయుండెడిదా! కనుక దయామయులగు ప్రభుత్వమువారిని వాఖ్రైబిల్లుగూర్చి పునరాలోచించుటకై మేము సవినయముగ కోరుచున్నాము.

ఒక విషయమిచట చెప్పవలసియున్నది. క్రొత్త సిద్ధాంతములకు పుట్టినిల్లగు రహబరె దక్కన్ ఉర్దూపత్రిక వాఖ్రైబిల్లుకై ప్రయత్నించువారిని గ్రుడ్డివారని వ్రాసినది. దేశమునందలి పరిస్థితులు ముఖ్యముగ బాల్యవివాహములవలన బాలికల ఆరోగ్యమెంతల క్షీణించుచున్నదో దుర్బల సంతాన మెటుల కలుగుచున్నదో, ఎందఱు శిశువులు పురిటిలో చనిపోవుచున్నారో, తెలిసికొనిన బిల్లు ప్రవేశపెట్టుటకు మన శాసనసభచుట్టు తిరుగుచున్నవారు గ్రుడ్డివారో లేక దేశపరిస్థితులు తెలియక వ్రాసిన రహబరెదక్కన్ గ్రుడ్డిదియో తెలియగలదు. బిల్లు ప్రవేశపెట్టువారియుద్దేశము గ్రహించజాలక లేనిపోని నిందల మోపుట అనౌచితము. ముసల్మానులకీ బిల్లు అవసరము లేకున్న హిందూజాతి అభివృద్ధికై మార్గదర్శముగనున్న నీ బిల్లును ప్రత్యేకముగ ఈజాతివారికే ప్రవేశపెట్టకూడదా?

ఈ బిల్లును అంగీకరింపజేయుటకు దేశాభివృద్ధికోరు ప్రజలు ప్రయత్నింపవలసియున్నది. ప్రజల సమ్మతి గైకొనవలసియున్నది. అధిక సంఖ్యాకులీ బిల్లును ప్రవేశపెట్టుటకు కోరుచున్నారని ప్రభుత్వమునకు తెలిసిన వారు తప్పక అంగీకరించగలరు.

## వ్యవసాయకుల సంఘము

మన వ్యవసాయ, పారిశ్రామికశాఖాధ్యక్షులగు బి. ఎ. కాలిన్సుగారి యాజమాన్యమున వ్యవసాయకుల సంఘము హైదరాబాదు నగరమున స్థాపించుటకై యొక సభ జరిగెను. దానివివరములు స్థలాంతరమున ప్రకటించియున్నాము. ఇప్పుడైనను ఉన్నతాధికారులకు రైతుల దుర్దశగూర్చి జాలి కలుగుట ప్రశంసనీయము. సభాచర్యనుబట్టి చూచిన ఉన్నతాధికారులు రైతుల ప్రాముఖ్యమును గ్రహించినట్లు విదితమగుచున్నది.

అయినను ఒక విషయమున మాత్రము మాకు సందేహముగలదు. హైదరాబాదులో స్థాపింపబడు నీ సంఘమువలన గ్రామములలోనుండు సేద్యగాండ్రకు నేమిలాభము కలుగునో యూహించజాలకున్నాము. ఈ సంఘముయొక్క యుద్దేశముల తెలిసికొనుటకు వ్యవసాయకులకు చదువురాదు. వారినికలిసి, వారికిగల కష్టనిష్ఠురములను తెలిసికొనుటకు సంఘము ద్వారా మురికికూపములని భావింపబడు గ్రామములకుచేరజాలరు. అధికారులనినంతనే పేదరైతులు భయభ్రాంతులగుదురు. కనుక యీ సంఘముయొక్క కార్యాచరణపద్ధతులెట్లుండునో వారికెంతవరకు లాభప్రదముగ నుండునో నియమావళి ప్రకటించినపిదప కాని తెలియదు. కాని యీ సంఘముయొక్క యుద్దేశము నగరములోని వ్యవసాయముపై అభిరుచిగల విద్యావంతులను ఈ వృత్తిలో ప్రవేశపెట్టుటకు ప్రోత్సహించుటయే అయియున్న దినదినము అధికపన్నులచేతను, గ్రామాధికారులయొక్కయు ప్రభుత్వాధికారులయొక్కయు చర్యలవలన కష్టములపాలగుచున్న నీ కృషికులకెట్టి మేలొనగూర్పజాలదు. కాలిన్సుగారియొక్కయు, ఇతర మహాశయులయొక్కయు అభిప్రాయములవలన వారు బీదరైతులను ఉచ్ఛస్థితికి దెచ్చుటకై కోరుచున్నారని విదితమగుచున్నది. దీనిచే బీదరైతులకష్టములు గట్టెక్కుగాక!

## గృహలక్ష్మి దసరాసంచిక

గృహలక్ష్మి మాసపత్రిక దినదినాభివృద్ధి గాంచుచు స్త్రీల యభివృద్ధికి మార్గదర్శకమగుచున్నదని తెలుపుటకెంతయు సంతసించుచున్నాము. దసరాసంచిక మేలైనవ్యాసములతోను, చిత్రపటములతోను, విరాజిల్లుచున్నది. ఇందుగల వ్యాసములలో చాలవఱకు ఆంధ్రసోదరీమణులచే రచియింపబడుటెంతయు సంతోషావహము. ఈ మాసపత్రిక వెలువడిన మూడు సంవత్సరములలో ఆంధ్ర నారీరత్నముల విద్యాభివృద్ధికి సాంఘికాభివృద్ధికెంత వన్నెగలిగెనో ఇందలి విషయములవలనే తెల్లమగుచున్నది.

స్త్రీరత్నములు వ్రాసిన వ్యాసములలో కీ॥ శే॥ మాగంటి అన్నపూర్ణాదేవిగారి 'భారతీయుడా' యను వ్యాసమును, దేవులపల్లి సత్యవతమ్మగారి 'నావ వేగమేనడుపుమయ్యా' యను గీతములును, మదమంచి అనంతమ్మగారి 'మాంచాల' యను పద్యములును, వోలేటి రత్నకల్యాణమ్మగారి 'గృహస్థ గృహిణి' యను వ్యాసమును బాల విజ్ఞాన శాఖయందలి గీతములును ప్రాముఖ్యమైనవి. కథలన్నియు స్త్రీయభివృద్ధి, నీతి బోధకమును ఆటపట్టులై యున్నవి. ముఖ్యముగా కీ॥ శే॥ మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి పద్యములు ప్రతినారీమణి గమనింపదగియున్నవి.

త్రివర్ణచిత్రములలో పార్వతీ పరమేశ్వరులును, గ్రంథ పరిశీలనమును, అలంకృతయును, సాధారణ చిత్రములలో కమలాదేవి చటోపాధ్యాయ, మొదలగునవియు అత్యంతరమణీయములై యున్నవి. శ్రీమతి ముప్పలనేని పుష్కరాంబగారు చిత్రించిన ఈ సంచికయొక్క ముఖపటము బాగుగనున్నది. మొత్తముమీద ఈసంచిక చాల ఆకర్షణీయముగ నున్నది. గృహలక్ష్మి చిరంజీవియై వర్ధిల్లి వనితా లోకమునకు నిరంతరము సేవ చేయుచుండుగాకయని కోరెదము.

## జన్మదినోత్సవ సంచిక

మేము మహాఘనత వహించిన శ్రీ నిజాం ప్రభువుగారి జన్మదినోత్సవమునాడు ప్రత్యేక సంచిక ప్రకటించుటకు నిశ్చయించితిమి. జన్మదినోత్సవము వైనెల ౧౫ వ తేది (నవంబరు [illegible]) శనివారము నాడగును. ఈ సంచికయందు శ్రీ నిజాం ప్రభువుగారి కాలమున జరిగిన సాంఘిక, రాజకీయ, విద్యాభివృద్ధిగూర్చి వ్యాసములును, పద్యములును, చిత్రపటములును, ప్రకటింపబడును. వ్యాసకర్తలు వైనెల ౧౧ వ తేది (నవంబరు ౧౯) శనివారమువరకు పైన సూచించిన విషయములపై వ్యాసములును, పద్యములును పంప ప్రార్థితులు.

# సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా (లిమిటెడు)

హెడ్ ఆఫీసు.—బొంబాయి ఇండియా యందలి ప్రతి ముఖ్యపట్టణములలో శాఖలుగలవు.

స్థానిక శాఖలు:—హైద్రాబాదు, సికింద్రాబాదు

కర్రెంటు డిపాజిట్స్:—లెక్కలు కల్దారు, రూపాయలలోను హాలీసిక్కాముల యందును వ్రాయబడి యున్నవి. చెల్లుబడి మరియు వుత్తి ఇవ్వబడును. ఎవరైనను రెండు నాణెములయందును లెక్కలుంచు కొనవచ్చును. సేవింగు బ్యాంకు డిపాజిట్స్:—

లెక్కలు కల్దారు, రూపాయలయందును హాలీ సిక్కాముల యందునుఉండును. వడ్డీ నూటికి సంవత్సరమునకు 3½ రూప్యములివ్వబడును. చెల్లుబడి మొత్తమునకు సం॥నకు నూటికి 4 రూ॥ వడ్డీ ఎవరైనా రెండు నాణెముల యందును లెక్కలుంచుకొనవచ్చును.

ఫిక్సెడ డిపాజిట్స్.—

నిలువ బెట్టబోవు మొత్తములు ఎల్లప్పటికైనను లేక కొంతకాలమునకైనను నుంచునట్లైనను ఉంచుకొనబడును. ఇవి రెండు విధముల నాణెముల యందుండవచ్చును! వీని వడ్డీ బాబతులు కంపెనీకి వ్రాసి తెలుసుకొనవచ్చును

లోన్సు ఓవర్ డ్రాఫ్ట్స్, క్యాష్ క్రెడిట్లు:

తగిన జమానతు మీద అందరికి తగిన వడ్డీ ప్రకారమివ్వబడును

స్టర్లింగ్ (డ్రాఫ్ట్స్) టెలిగ్రాఫిక్ ట్రాన్సఫర్స్:నేరుగా హైద్రాబాదు నుండి యివ్వ చేయబడును.

బంగారుకడ్డీలు: 10 తులముల లేక 5 తులముల బరువు కలవియు చక్రవర్తి గారిముద్రయుండుకలవి అమ్మబడును

సే॥ డిపాజిట్: ముద్రవేసిన పంపిన సైకమును జమానతులును జాగ్రత్తగానుంచుట కొరకు ఒప్పుకొనబడును. వాని మీద వడ్డీ రాబట్టబడును. ప్రతి విధమైన బ్యాంకు కార్యము జరుపబడును.

---

## ఆయుర్వేద ఔషధములు   ఖద్దరు వస్త్రములు

మావద్ద హిందూ దేశమునందును, విదేశములందును ప్రసిద్ధిగాంచిన ఆయుర్వేద ఫార్మసీల శాస్త్రీయ ఔషధములు, శుద్ధ ఖద్దరును సరసమైన ధరలకు విక్రయింపబడును.

రోగ వివరములు వ్రాసిపంపినచో అనుభవజ్ఞులగు ఆయుర్వేదరత్న డాక్టరు ఆర్. ఎం. డి. వి. గారి సలహా ప్రకారము ఔషధములు పంపుదుము.

వివరములకై జవాబు కార్డు వ్రాయవలయును, ఔషధములకై ఆర్డరిచ్చువారు కొంత సొమ్ము అడ్వాన్సుగా పంపవలయును.

బి. ఎస్. శెట్టి అండుకో

౧౦౨ మార్కెటు రోడు హైద్రాబాదు (దక్కన్.)

---

## దక్కన్ ఫినాయిల్ (రిజిస్టరు)

ఇది దేశీయపరిశ్రమలలో ప్రధమ పేరెన్నికగన్న ఫినాయిలు, దీని లాభములను గమనించి విశ్వాసపాత్రులగు డాక్టర్లు, వైద్యులును, ఉన్నతోద్యోగులును, దేశ విదేశ ప్రముఖులును, సర్టిఫికేట్లు నొసంగియున్నారు బెంగుళూరు ప్రదర్శనమున స్వర్ణపతకము బహుమానముగ నొసగబడినది ఈ మా ఫినాయిలు దినదినాభివృద్ధిగాంచి ఎందరో దీనిని చేయుటకు ప్రయత్నించిరి. ఇంకను చేయుచున్నారు కనుక మానుండి కొనునప్పుడు నకిలీ మాలనుండి జాగ్రత్త పడుటకు "దక్కన్ ఫినాయిల్" పేరును, ఇరువురు స్త్రీల గీతల వస్త్రములతో కూర్చుండియున్న పటముగల ట్రేడ్ మార్కును, పరిశీలించవలయును ఉపయోగించి వీరా ప్రతిచోట ఖర్చులుగాక ౧౪ అణాలకు లభించును.

మేనేజరు దక్కన్ ఫినాయిల్ కంపెనీ

పురానాహవేలీ వెనుక హైద్రాబాదు.

---

మా వద్ద హార్మోనియములు క్యామెరాలు గడియారములు, గ్రామఫోనులు, రికార్డులు, తదితర వస్తువులు, ఫొటోగ్రాఫ్ సామానులు మొదలగునవి చౌక ధరలకే లభించును.

బి. జి. చిమల్‌గీకర్ గోలీగూడెం పుత్లిబావి హైద్రాబాదు

---

## దాసబోధ

చిత్రపటాలంకృతము   831 పుటలు

శ్రీ శివాజి చక్రవర్తికొఱకు ప్రత్యేకించి మహర్షి శ్రీసమర్థ రామదాసస్వామి రచించిన మహారాష్ట్ర గ్రంథమునకిది తెలుగు వచనము. శ్రీ శివాజి నిత్యము పఠించిన పవిత్రగ్రంథము. ఇందు రాజనీతి, వేదాంతము, లోకజ్ఞానము, పరమాత్మను దర్శించు రీతి, మోక్షము, మున్నగు సర్వాంశములు గలవు. రానడే, గాంధి, తిలకు మున్నగు మహాత్ములు ప్రశంసించిన గ్రంథరాజము. మానవ జీవితమునకీ గ్రంథరాజము సర్వవిధముల మార్గదర్శకము గాగలదు. ఇందులేని అంశములేదు. కాకతీయ గ్రంథమాలలో నిది నాలుగవ కుసుమము. వెల పోస్టేజికాక రు 4—8—0 లు మాత్రమే. కొలది ప్రతులే

---

## క్రియయొక్క శక్తి

ఉచితము

పరీక్షార్థము

సర్వజీవక్.

విచిత్ర శక్తిగల దీనిని ధరించుకొనిన. గ్రహశక్తిపిశాచములు, బ్రహ్మరాక్షసులను పారద్రోలుట యందును పుత్రులు లేనివారికి సంతాన ప్రాప్తి కలిగించుట యందును అసాధ్య అనివార్యమయిన మహారోగములు నివారించుట యందును, మృత్యు పాశమునుండి సంరక్షించుట యందును. దుర్మదగర్వాంధ కారమును పోగొట్టుట యందును, దుర్జనులను సజ్జనులుగ మార్చుట యందును. ప్రభుదర్శనమునకై తీవ్ర ఆవేదనపడు చున్నవారికి వారు కోరుచున్న కొలువునే దర్శనమిచ్చుట యందును, దుర్భరదారిద్ర్య మును పారద్రోలి సిరి సుఖసంపద కలుగచేయుట యందును మహాఋణ బాధలనుండి సంరక్షించుట యందును, కోరిన కోరికలు సఫలము చేయుటయందును, అద్వితీయముగ పనిచేయు చుండును. మరియు గొప్పవారిదయ, కార్యసిద్ధి, ధనలాభము, వ్యాపారవృద్ధి, న్యాయస్థానములలోను కాలముపరీక్షలలో జయము ఉద్యోగము చేకూరుట అదృష్టము పొందలేనవి కలుగును. మేగు కలరా స్ఫోటకము సోకవు. కష్టములను గండములను తొలగించును ఆరోగ్యము బలము తెలివి అందము నిచ్చును, అనేకమంది మెప్పుపొందినది. ప్రయాణ ప్యాకింగు అంచనాలి ఖర్చులకై రూ. 1-4 పంపిన ఉచితముగా పంపబడును. వి పి. గా రు 1-8-0 అగును.

ప్రొఫెసర్: పి. వి. యస్. నాయుడు,

పెదగొట్టిపాడు గ్రామం, ప్రత్తిపాడుపోస్టు

వయా: గుంటూరు. (గుంటూరుజిల్లా,

Prof. P. S. NAIDU,
Peddaqottpiadu, Village,
Prathipadu, P. O., (Via) Guntur,
Guntur Dt,

---

## మీకు సౌఖ్యము కావలెనా

ఈ ప్రపంచములో ప్రతి మానవుడును సంతోషముగ నుండవలెనని కోరు కొను చుండును నిజముగా సౌఖ్యమును పొందవలెనంటే మనము ఆరోగ్యముగా నుండవలెను. అట్టి ఆరోగ్యమునకై

## ఆతంకనిగ్రహ మాత్రలు

వాడుడు., వేనవేలు ప్రజలుకూడ సౌఖ్యము ననుభవించుచున్నారు. ఒక సారి వాడిచూచినగాని మీకు బోధపడదు. 32 మాత్రలుగల డబ్బి ౧ కి ౧—౦—౦ వివరములకు ఉచితముగా పంపబడు మా పుస్తకమును చూడుడు

విలయువారు:—

ఆతంక నిగ్రహ ఫార్మసీ

జి. టి. బ్రాడ్వే మద్రాసు,

ఏజంటు:—N. పద్మరాజు.

మొజంజాహీ మార్కెటు.

---

## ఆంధ్ర బుక్కు డిపో

| | |
|---|---|
| ఆంధ్రదినపత్రిక సంవత్సరము చందా రూ ౨౫ ౦ ౦ | |
| ,, అర్ధ సం॥ చందా ౧౪ ౪ ౦ నెలచందా రూ ౨ ౯ ౦ | |
| ఆంధ్రవారపత్రిక సంవత్సరము చందా | రూ ౪ ౧౨ ౦ |
| భారతి సచిత్రమాస పత్రిక సం॥ చందా | ౬ ౨ ౦ |
| హిందూలా (ధర్మశాస్త్రము) | రూ ౩ ౮ ౦ |
| తిరుగుడుపెండ్లి నవల | రూ ౧ ౮ ౦ |
| ఆత్మకథ మహాత్మగాంధిగారి జీవితము | ౧ ౦ ౦ |
| ఆంధ్ర భగవద్గీత ఆ సోమశేఖరావుగారి కృతము | ౧ ౩ ౦ |

మావద్ద సమస్త గ్రంథములు దొరుకును పుస్తకములను వి. పి. గా తెప్పించుకొనువారు సగము సొమ్ము ముందుగ మనియార్డరుద్వారా పంపించవలయును పుస్తకముల కొరకు వ్రాయువారు జవాబు కొర్డు వ్రాయనిచో జవాబు వ్రాయబడదు,

నా. శారీశంకరవర్మ అండు కో

## సమస్తనేత్రవ్యాధులను సంతృప్తికరముగ కుదుర్చు

### "లోటసుహోని"

### LOTUS HONEY

యమునీయౌషధము ప్రకృతిరూపకమైనది. ఇది తామరపువ్వు ములనుండి గ్రహింపబడిన తేనె. శస్త్రవైద్య మవసరములేకయే కండ్లపొరలను కోయును చమత్కారమైన నిర్భీతిగ నత్యంత సులభముగ దీనినుపయోగించవచ్చును. దృష్టిదోషములేని కన్నుల కుపయోగించిన రాబోవు వ్యాధులనుండి రక్షించును. నేత్రవాయువులు, దృష్టిలోపము, రేజీకటులు, కంటి మూతలు, కంటిపువ్వులు, కంటికూనలు, దృష్టిమాంద్యము, కంటికురుపులు, శ్వేతకామిల, కృష్ణకామిల, హారిద్రాకామిల, సదానీరుకారుట, నొప్పి, కాంతిహీనములగుట మొదలగు జాడ్యముల కన్నిటికి వజ్రాయుధము.

ఇంగ్లీషు ఔషధ విక్రయశాలలన్నిటిలో లభించును. నైజామురాజ్యవాసుల సౌకర్యమునకై సికింద్రిందివారల నేర్పరచియున్నాము.

జే. ఫౌస్టు అండుకంపిని సికిందారాబాదు

J. Faust & Co., Secunderabad

లేస్లీగే అండు కంపిని హైదరాబాదు.

Leslie Gay & Co,. Hyderabad

వ్యాపార మభివృద్ధి జెందుటకు

ప్రకటనయేముఖ్యము.

నేడే

## గోలకొండపత్రికలో

ప్రకటన లియ్యుంచి

లాభముపొందుడు.

## గోలకొండ బుక్ డిపో

| | |
|---|---|
| ౧ రెడ్డికుల నిర్ణయచంద్రిక | ౧-౮-౦ |
| ౨ సంఘోద్ధరణము | ౦-౫-౦ |
| ౩ పంచముల చరిత్ర | ౦-౮-౦ |
| ౪ భారతీయ స్త్రీ ధర్మములు | ౦-౮-౦ |

ఈ నాలుగు గ్రంథములు ఒకేసారి తెప్పించుకొనువారికి ౧ తిప్పన్న చరిత్రము ౨ జీడికంటి రామశతకము ౩ బమ్మెర పోతనామాత్య విజయము ౪ క్షయవ్యాధి ౫ కృష్ణాలహరి మొత్తము ఒక రూపాయి పుస్తకములుచితముగ నివ్వబడును. తపాల ఖర్చులు వేరు.

కొన్లకుబూలియ్యతులు నూటికి రు ౩ లు,

గోలకొండ బుక్ డిపో

౧౯ ౦౯, తూర్పుబజారు హైద్రాబాదు (దక్కన్)

## హిస్పాను సుదర్శన హోటలు

**(Sudershan Hotel)**

అఫ్జల్ గంజు హైద్రాబాదు

విశాలమైనగదులు, పరిశుభ్రమైన రుచికరమగు భోజనము నగరమునకు మధ్యన ఆఫీసులు. కార్యాలయములు, పాఠశాలలు, మార్కెటులు బజారు మొదలగునవి అందుబాటులో గలవు. ఒకసారి దర్శించిన అన్నియు విశదము కాగలదు. ధరలు అతిచౌక. వెంటనే వివరములు కనుగొనుడు.

మేనేజరు

## గోలకొండ పత్రిక

### ఏజంట్లు

హైదరాబాదు

| | |
|---|---|
| 1 జీ. ఆర్. మూర్తి | గౌలిగూడ |
| 2 నా. గౌరీశంకరవర్మ | రెసిడెన్సీబజారు |
| 3 కాళిదాసు బి పురోహిత్ | ,, |
| 4 డి. యస్. మొహతా ఛత్తరు మసీదు ఎదుట | గౌలిగూడ |
| 5 ధర్మయ్యాచారిగారు భువనగిరి | |

## డోంగ్రేగారి బాలామృతము

ఉపయోగించుట వలన

బలహీనతను పోగొట్టును

బిడ్డలకు బలమునిచ్చి

సౌఖ్యము కలిగించును

ఒక బుడ్డి వెల ౧ రూపాయి

పోస్టు ఖర్చులు ౯ అణాలు

ఎల్ల చోటులందును దొరకును

K. T, DoNGRE & Co,
GIRIGAUM, BOMBAY




## అమృతాంజనము

తలనొప్పులు, పార్శ్వపు నొప్పులు, పక్షవాతము, బెణుకులు, తీపులు, వాపులునకు గోలకొండకు వజ్రాయుధము.

అమృతాంజనము డిపో

మద్రాసు బొంబాయి

## గోలకొండపత్రిక

తూర్పు బజారు హైద్రాబాదు దక్కన్.

సంవత్సరము చందా

| | |
|---|---|
| | రు. ౭-౦-౦ |
| అర్ధ ,, | ౩-౧౨-౦ |
| విడి పత్రిక | ౦-౧-౪ |

Print d and Published byG. Ramakrishna Red d at Golkonda PowerPress, Hyderabad, Dn Editor K. Balakrishna Reddy.